Regd No. N. 45 / M. 3813

గోలకొండ కవులసంచిక
చందాదారులకు ౧ రూపాయి
మేనేజరు.
గోలకొండ పత్రిక
శాలిబండ బజారు,
హైద్రాబాదు-దక్కను.

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

హైద్రాబాద
వివరములకు
నిజాంరాష్ట్ర
పరిపాలనము
వెల ౮ అణాలు
గోలకొండ బుక్ డిపో
శాలిబండ బజారు,
హైద్రాబాదు.

సంపుటము ౧౨ | హైద్రాబాదు-దక్కన్ | శా.శ.౧౮౬౦ బహుధాన్య నామసంవత్సర చైత్ర శు॥ ౨ | (౩ ఖుర్దాద్ ౧౩౪౭ఫ.) గురువారము | సంచిక ౬౩

## ప్రజల మోసగించుటకు, తమ నిరంకుశ ఆటలు సాగించుటకు

# నిరంకుశ పాలకులు పన్ను మాయోపాయములు

## సంస్థాన ప్రజలలో వృద్ధిగాంచుచున్న ప్రబోధభావము లాశాపూరితములు

## ప్రాథమిక పౌరసత్వముల సంసిద్ధికి కృషి సలుపుటయే ప్రజల ముక్తిదాయకము

కె. ఎఫ్. నారిమన్‌గారి ప్రకటన

(గోలకొండ విలేఖరి)

తిరువేంద్రము, ఏప్రిల్ ౨

"మైసూరువలెనే తిరువాన్కూరు ప్రజల స్థితి యుత్సాహజనకముగా, ఆశాపూరితముగా గలదు. ఈ యుభయసంస్థానములందు అధికారులు ప్రజలయందేర్పడుచున్న జాతీయ భావములను, ప్రజాపరిజ్ఞానమును నణచివేయుటకు అధికారులు తీవ్రముగా ప్రయత్నించుచున్నను ప్రజలలో మాత్రము ప్రభుత్వమువారి నిర్బంధ విధానములవలన చక్కని జాగరూకత యేర్పడుచు వారియందు జాతీయ సమరోత్సాహము రెట్టింపుచేయుచున్నది" అని విఖ్యాత న్యాయవాదులు, కాంగ్రెసు నాయకులు శ్రీ కె. యఫ్. నారిమన్‌గారు తిరువాన్కూరుయందలి రాజద్రోహ నేరమునందు వాదించుటకు లేదని సెషన్ న్యాయమూర్తు లాజ్ఞాపించినపిమ్మట తమ అభిప్రాయమును పత్రికా ప్రకటనద్వారా విశదపరచిరి.

ఆ ప్రకటనయందే "ఈరెండు సంస్థానములను మరొక సమానతగలదు. ఈ రెంటియందు ప్రజా స్వాతంత్ర్యరూపము విశదపడు నిరంకుశ ప్రభావమాత్యుల పరిపాలనముగలదు. వీరు ప్రజాభిప్రాయమును సంస్థానేతర ప్రాంతములందలి చాకచక్యముతో విశదపరచుటకు ప్రయత్నించుచుదురు. మైసూరులో నిర్మాణ రాజకీయేతరమును నిరపాయకరమును ఖాదీ, హరిజనోద్యమమునుగురించి ప్రజాభిప్రాయము కేంద్రీకరించుటకు ప్రయత్నింపబడినది. తిరువాన్కూరునందు సహితమిటులనే యొకరాజకీయ గిడసబారముతో పరిపాలనాలోటులు కప్పిపుచ్చుటకు కృషిసలుప బడుచున్నది. అది హరిజనుల దేవాలయ ప్రవేశము. నిరంకుశుల ఆటలు నిరాటంకముగా సాగుటకిట్టి రాజకీయేతర నిరపాయకరమగు విషయములగురించి ప్రజాభిప్రాయము కేంద్రీకరింపబడుచున్నది" అని వివరించిరి.

"కాని యీరెంటిలో యొకభేదము గలదు. మైసూరునందు మర్యాద, వినయ విధేయత, సహనము రూపమున్నటుల నటింపబడినది. రాజకీయ ప్రతికూలురుల విషయములో వ్యక్తిగత ప్రవర్తనము మైసూరునందు తిరువాన్కూరు మాదిరి యింతనీచముగా అమర్యాదగా లేదనుట స్పష్టము" అనిరి.

తిరువాన్కూరు రాజకీయ వాతావరణము శ్వాస నిరోధకముగా గలదు. తిరువాన్కూరునందు వాక్స్వాతంత్ర్యములేదు. భావప్రకటనా స్వాతంత్ర్య మసలేలేదు. ఈ సంస్థానములందు ప్రతిరోధభావములు విపరీతముగా అభివృద్ధిగాంచుచున్నందుల కొంతవరకు సంతసించవచ్చును. ఇంచుకైనను ఫలితముల గమనించదలచిన ప్రజలు తమహక్కులు, స్వతంత్రము బడయుటకు కృతనిశ్చయులై యుండుట మిగుల ముదావహము" అని ప్రజలస్థితుల వివరించిరి.

"ప్రజలు తమ అల్పవిభేదముల నెంత మెందించుకొను టత్యావశ్యకము. సంస్థానమందలి వివిధవర్గములవారేకమై, క్రమక్రమముగా ప్రాథమిక పౌరసత్వముల బడయుటకు తీవ్రముగా కృషిసలుపవలయును. రాజకీయ స్వాతంత్ర్యమునందు గౌరవార్హతలు గడించుటకు కృతనిశ్చయులు గావలయును. వీరి విషయమును హృదయపూర్వకముగా వాంఛించుచున్నాను" అని హ్ఫ...

---

ఏప్రెలు ౬
౪ గం. ౧౫ ని.

ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో విచారించగా, ఆస్పత్రిలోకి ౨౧మంది గాయములు తగిలిన వారలు చేర్చుకొనబడిరనియు, అందులో ౧౫ మంది హిందువులనియు, ౬గురు ముసల్మానులనియు, తెలియుచున్నది. ౪౻ గం. ల వేళ ఒక పోలీసు అమీను తలపై దెబ్బలతో తేబడెను. చిన్న గాయములు తగిలినవారలుకొందరు ఆసపత్రిలో చికిత్సచేయబడిరి.

---

(అసోసియేటెడు ప్రెస్సు విలేఖరి)

అసోసియేటెడు ప్రెస్సువారు పంపిన వార్త ఇట్లున్నది.

మంగల్ ఘాట్ లో ప్రతిసంవత్సరము జరిగినట్లే ఈ సంవత్సరముకు వచ్చిన ఉరుసులో ముసల్మానులు తీసిన ఊరేగింపునందు, హిందువులకును ముసల్మానులకును పెద్దకొట్లాట జరిగియుండవలసినది. అదిపోలీసులు సకాలమున గట్టిచర్యగైకొనుటవలన తప్పినది.

హిందూ మందిరముప్రక్క ఊరేగింపు పోవుచుండగా అది హిందువులచే ఆపబడెను. హిందువులు దాని నాదిక్కున పోనీయలేదు. ముసల్మానులకు దీనిపై కోపమువచ్చెను. ఆగ్రహము పెరిగెను. ఇట్టి ఉద్రేకపరిస్థితులలో చుట్టుప్రక్కల ఇండ్లనుండి రాళ్ళు ఊరేగింపుపై వేయబడెను. కొత్వాలుగారును ఇతర పోలీసు అధికారులును అచటికి అనేకులు పోలీసులతో వెంటనేవచ్చి, కొంతమందిని అరెస్టుచేసి శాంతిని స్థాపించిరి.

సుమారు ఒకడజనుమందికి చిన్నగాయములు తగిలినవి. గాయములు తగిలిన వారలలో నల్గురు కానిస్టేబిళ్ళును గలరు.

పోలీసువారు ఇప్పుడు కాపలాకాయుచున్నారు.

తర్వాత వార్తలవలన మధ్యాహ్నము ౩ గం. వేళ రాళ్లువేయుటచే రెండుచోట్ల చిన్న సంఘర్షణలు రెండు సంగళేఘాటులోను జుమ్మేరాత్ బజారులోను జరిగినట్లును, అందుచే ఇరుపక్షములయందును ౧౨మందికి గాయములు తగిలినట్లును తెలియుచున్నది. సాయుధ పోలీసులు అక్కడక్కడ నంచబడినారు. లాఠీలు ఇతర ఆయుధములు అల్లరిజరిగిన చోట తిరుగుచున్న వారల వద్దనుండి

## దఫా ౧౪౪ అమలు.

(గోలకొండవిలేఖరి)

హైద్రాబాదు (దక్కన్) ఏప్రిలు౭ (ఉదయం ౭౻ గం.)

ఉదయము ఉస్మానియా ఆస్పత్రిలో విచారించగా ౬౩ మంది గాయముల చికిత్సకై చేర్చుకొనబడినట్లు తెలిసినది.

ధూల్పేటలోను, ఎగువ ధూల్పేటలోను, మంగల్‌ఘాటులోను ౧౪౪ దఫా అమలు చేయబడినది.

నిన్న రాత్రి చనిపోయినఒకపఠానుని శవమును ఊరేగింపుచేయుటకై సంకల్పించి బేగంబజారు సమీపమునందు వేయిమంది గుమికూడి యున్నారు. ఇంకను గుంపులు చేరుచున్నవి. అందరి చేతులలోను లాఠీలు సిద్ధముగా ప్రయోగించదగిన స్థితిలో ఆయుధములును నున్నవి.

---

నాయకులకు
కొత్వాలుగారి ఆహ్వానము

హైద్రాబాదు ఏప్రిలు ౬

నగరరక్షక శాఖాధికారి (కొత్వాలు) అగు నవాబ్ రహమతుయార్జంగ్ గారు అల్లరులు జరుగుచున్న స్థలములలో హిందువుల శాంతింపజేయుటకై శ్రీ మాడపాటి హనుమంతరావుగారిని, వినాయకరావుగారిని, కాశీనాథరావు వైద్యగారిని ... చోటదేవాలయమువద్ద శాంతికొరకు కొంతప్రయత్నముచేసిరి తర్వాతవారలు రైట్ ఆనరబిల్ సర్ అక్బరు హైదరుగారివద్దకు వారితో తాముచూచిన పరిస్థితులనుగూర్చి విన్నవించుకొనిరి, సర్ అక్బర్ గారు భయపడవలసిన అవసరమేమియు లేదనియు పోలీసువారు తగుచర్య గైకొనుచున్నారనియు త్వరలో శాంతియేర్పడగలదని అభయమిచ్చినట్లు తెలియుచున్నది.

---

## వ్యాపారస్థుల భీతి

రెసిడెంటు, ప్రధానమంత్రులకు తంతి సందేశములు

హైదరాబాదు (దక్కన్) ఏప్రిలు ౭
మధ్యాహ్నము ౨౻ గం.

ఇక్కడి వ్యాపారస్థులు బ్రిటిషు రెసిడెంటునకు, రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరీ (ప్రధానమంత్రి) గారికిని పంపిన దీర్ఘమైన తంతి సందేశములలో కొట్లాటలుపుట్టిన ప్రదేశములందును బేగంబజారునందును పరిస్థితులను గూర్చి విశదపరచుచున్నారు. "నిన్న రాత్రియంతయు బేగంబజారులో సాహుకారులు వ్యాపారస్థులు తమఆస్తికిని ప్రాణములకును ఏమి ఉపద్రవము కలుగునోయని భయపడుచుండిరి. పోలీసు కట్టుదిట్టములు నిరాశకలిగించునంత అధ్వాన్నముగ నున్నవి. ఒక్కొక్కసారి ౫౦-౬౦ మంది గుండాలు కత్తులు, లాఠీలు, తుపాకులు మున్నగువాటితో రాత్రియంతయు వీధులలో తిరుగుచుండ, ఎట్టియాయుధములుగాని లేకుండ మమ్ములను ఇద్దరేని ముగ్గురేని వంతువనైనను పోనీయలేదు. మమ్ములను ఇండ్లలో నుంచిరి. గూండాలు రాళ్లు వేసిరి, తిట్టిరి, తలుపులు పగులగొట్ట యత్నించిరి. కాని భగవదనుగ్రహమువలన బ్రతికితిమి ఈక్రింది చర్యలుగైకొనవలెనో ఆస్తిప్రాణములకును గొప్పఉపద్రవము కలుగగలదు. (౧) యూరపీయుపోలీసులును సైనికాధికారులును వీధులలో తిరుగుచుండవలెను, (౨) కొట్లాటప్రదేశములలో ఎవరిని తిరుగనీయరాదు. (౩) ఉపద్రవభయమున్నచోట్ల దుకాణములను మూసివేయవలెను. మమ్ములను ప్రాణభయమునుండి కాపాడెదరని ఆశించుచున్నాము." ఇది తంతి సందేశము.

మధ్యాహ్నము ౨ గంటలకు విచారించగా ౨౦౦ మందికంటె మించి గాయపడిన వారిసంఖ్య యున్నట్లు తెలిసినది.

హైదరాబాదు ఏప్రిల్ ౭
[మధ్యాహ్నము ౧-౨ గం.]

ముగ్గురు చచ్చినట్లు తెలిసినది. ఇద్దరు ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో చచ్చిరి. మంగల్ ఘాటు ధూల్పేటలలో నిర్జనముగానున్నట్లున్నది. కాని ఇక్కడి వీధులలో ప్రజలువిశేషముగానే తిరుగుచున్నారు. అఫ్జల్ గంజ్‌లో ఆనేక దుకాణములు బందీ చేయబడినవి.

# నగరములో హిందూ ముస్లిం అల్లరులు

## దుండగీయుల విపరీత దౌర్జన్యములు

## పోలీసువారు శాంతిసంరక్షణకు ప్రయత్నించుట

## సర్ అక్బరుగారి అభయము

## ౨౦౦ మంది గాయపడుట

(గోలకొండ విలేఖరి)

హైదరాబాదు ఏప్రిల్ ౬.

౫వ ఏప్రిలు రాత్రి ౧౦ గంటలకు జరిగిన మతకలహమువలన మంగల్‌హాట్, ధూల్‌పేట పరిస్థితులు నేటియుదయమున తీవ్రరూపము దాల్చెను. ఆప్రాంతమందలి దుకాణములన్నియు మూసివేయబడియుండెను. మంగళ్‌హాటునందలి మహమ్మదీయులు కొందరు హిందువుల ముట్టడించుటవలన సుమారు ౧౨ మంది తీవ్రముగా గాయపడిరి. గాయపడిన వారలలో నొకడు మృతిజెందెనని చెప్పబడినది. ఉదయమునసే పోలీసుఅధికారులు, కొత్వాలు బహద్దరుగార లాప్రదేశమును వీక్షించి శాంతిసంరక్షణకై ప్రజల నుద్బోధించిరి.

నగరమందలి యితర వీధులలో సహితమచ్చటచ్చట కలహములు జరిగినటుల గలదు. మతవైషమ్యములు ప్రారంభమైన ప్రాంతములలో సాయుధరక్షకభటులు కాపలాకై యేర్పడియుండిరి.

మధ్యాహ్నము రెండుగంటలవేళ మహబూబుగంజువద్ద కూర్చొనియున్న యిద్దరు హిందూ స్త్రీలను మహమ్మదీయ దుండగీయులు కొందరు అనవసరముగా కొట్టుటచే పెద్దగల్లంతు జరుగవలసియే యుండెను. కాని పోలీసువారి సత్వరసహాయమున అట్టివిపరీతమేమియు జరుగలేదు.

సుమారు గంటనుండి ఫీల్ఖాన, బేగంబజారు, సిద్దిఅంబర్ బజారు, ఉస్మాన్‌గంజ్ ప్రాంతమందలి వర్తకులు దుండగీయులు లూటీ చేయుభయముతో అంగడులు మూసివేసిరి.

రహాకారిణము

మంగల్‌హాటు (మంగళవారం అంగడివీధి) నందొక దేవాలయావరణమందొక గోరీవద్ద మహమ్మదీయులు ఉరుసు చేయ సంకల్పించిరి. ఉరుసు చేయుటకు వీలులేదని హిందువులు తెలిపినను వినక వారు తమప్రయత్నము సాగించుచుండిరి. వేలకొలది మహమ్మదీయులాప్రదేశమునందుగూడి సందల్ యూరేగింపు జరిపిరి. ఆయూరేగింపుపై దుండగీయులెవరో రాళ్లు సోడాబుడ్డులువిసరినటుల వదంతి ప్రబలెను, దీంతో మహమ్మదీయు లుద్రేకులై సంచలించ మొదలిడిరి. అంతవరకు నవాబు బహద్దురుయార్జంగు బహద్దురు, నాజర్‌యార్జంగు బహద్దుర, హిసామొద్దీన్ ప్రభృతులు శాంతిసంరక్షణార్థము పర్యటించుచుండిరి. పరిస్థితులు విషమించుచునని పోలీసువారు నీటిలద్వారా సహాయము పేక్షించిరి.

ప్రభువుగారికి తంతి

మ. ఘ. వ. నిజాం ప్రభువుగారికి ఈక్రింది టెలిగ్రాము పంపబడినది. దీనిప్రతులు సర్ అక్బర్ హైదరీగారికిని, పోలీసుశాఖ మంత్రి ఆర్. యం. క్రొఫ్టగారికిని పంపబడినవి

నవాబుబహదర్‌యార్జంగుగారి ప్రేరేపణచే ముసల్మానులు మాప్రదేశమందు ఎన్నడుచేయని క్రొత్త ఉరుసు నొకదానిని ప్రారంభించినారని ధూల్పేట, ఎగువ ధూల్పేటలలో నుండు హిందువులు చాల వినయముతోను, గౌరవముతోను, విన్నవించుకొనుచున్నారు. ఈవిషయములో ఒక దివానీదావా న్యాయస్థానమునందు విచారణలో నున్నది. ఏప్రిలు ౫వ తేదీ నాడు రాత్రి ముసల్మానులు హిందువులను కొట్టి అల్లరిచేసి... ప్రాణములకును

తమహించిన ప్రభువుగారు అనుగ్రహించి శాంతిని, క్రమమును సంరక్షించుటకు అవసరమైన చర్యలు గైకొందురని ఆశించుచున్నాము.

సాయుధ రక్షకభటుల సంరక్షణ

హైద్రాబాద, ఏప్రిల్ ౬.

సుమారు ౪ గంటలకు సాయంకాలము వేళ శాంతి సంరక్షణార్థము పోలీసువారికి తుపాకులు, తోటాలొసగబడినవి. మంగల్‌హాటు, ధూల్‌పేటకు వెళ్లుమార్గములన్నియు సాయుధ రక్షక భటులవలననే కాపలాగాయబడుటగాక ప్రజలను వెళ్లనివ్వకుండిరి. కాని అచ్చటచ్చట గుంపులుగుంపులుగా ప్రజలీవిషయమును చర్చించుచుండిరి. నగరమునందంతట మహమ్మదీయులు కత్తులు, బాకులు, కర్రలు, లాఠీలతో తిరుగుచుండిరి. రాత్రి సుమారు ౧౦గంటలవేళ వందలకొలది మహమ్మదీయ దుండగీయులు కేకలు పెట్టుచు లాఠీలయుక్తముగా అఫ్జల్‌గంజ్ ఆస్పత్రినుండి బేగంబజారువైపు వెళ్లి అచ్చట నొకయింటికి నిప్పంటించిరి. రామకిషన్‌ధూతు టెలిఫోను ద్వారా నిప్పు చల్లార్పు యంత్రము వారికి విషయము విశదపరచిరి. కాని స్థానిక ప్రజల సహాయమున నిప్పు చల్లార్పబడెను.

రాత్రి సుమారు ౧౨గంటలవేళ కొన్నివేల మహమ్మదీయ లూరేగింపుతో జాంబాగు నుండి బయలుదేరి కేకలిడుచు తురుపుబజారు ద్వారా రెసిడెన్సివరకువెళ్లి కాచీగూడెము నుండి వచ్చుచుండిన యూరేగింపుతో కలిసి యిసామియాబజారు వగైరా వీధులలో సంచరించిరి. గౌలిగూడెమునందు సహితమిటులనే దుండగీయులుదముచు సంచరించిరి. గురుద్వారయందలి సిక్కులుమాత్రము శాంతిభంగము కలుగకుండునటుల కాపలాగాయుచుండిరి. ౭వతేది యుదయమువరకు ఆస్పత్రియందు సుమారు ౬౦మంది తీవ్రగాయములవలన చేర్చబడినటుల గలదు.

నల్లగొరి మసీదుకు సమీపమందలి యొకసంవర్ యూరేగింపునందు సుమారు ౪౦ వేల మహమ్మదీయులుండిరి. హాజీ జరుగుచున్న మసీదునందిదివరకే ౫వేల మహమ్మదీయులుండిరి. హాజీజరుగుచున్న మసీదునందిదివరకే ౫ వేల మహమ్మదీయులుండిరి. బహద్దురు యార్జంగు బహద్దురుగారి సమూహమున ఉపన్యసించినటుల దక్కన్‌న్యూసువారు తెలుపుచున్నారు

జేష్ఠవారం-
అంగడివీధి.

దుండగీయులీప్రాంతమునచేరి యల్లరిచేయుటచే యిచ్చట సంఘర్షణ మారంభమయ్యెను. ఉభయవర్గములవారు రాళ్లురువ్వుటచే అనేకులు గాయపడిరి, గాయపడినవారు ఆస్పత్రికి చేర్చబడిరి. పోలీసువారు శక్తికొలది యీ విషవాయువులు ప్రసరింపకుండుటకు ప్రయత్నించుచున్నారు.

మధ్యాహ్నము పరిసరప్రాంతములందనేక స్థలములలో సంఘర్షణములు జరిగినటుల వార్తలు వచ్చినవి. ఈ సంఘర్షణములవలన వ్యాపారస్థులకు నష్టము వాటిల్లినది.

పరిసర ప్రాంతమందలి సంగమగొందలలో సంఘర్షణజరుగు వదంతులు తెలియగనే పోలీసు కమీషనరుగారగు నవాబు రహమతుయార్జంగు బహద్దరుగారు స్వయముగా కాపలాగానిరి.

వారల చేతులలోనుండి గైకొనుట. కొట్లాటించిరి. చివరకు నవాబు సుల్తాన్‌యార్జంగు బహద్దురుగారు ప్రజలబోధించి అల్లరి జరుగకుండ సలిపిరి

రాజారుఖాన్ పేటలో
అల్లరి

కార్వాన కావలగల రాజారుఖాన్‌పేటయందు అల్లరులు ప్రారంభమయ్యెను. వెంటనే పోలీసు అధికారులు, సశస్త్రభటులతో ఆప్రదేశమునకు వెళ్లిరి. రాళ్లు రువ్వుకొనుచున్న దుండగీయులను చెల్లాచెదరు గావించిరి.

గౌలిగుడెములో
అల్లరి సూచన.

నేడుదయము ౯గంటలవేళ శంకర్‌శేర్ హోటలు ప్రక్కనగల మహమ్మదీయుల హోటలులో కొందరు మహమ్మదీయులుండిరి. లోపలనుండి కొందరు హిందువులు వెళ్లుచుండ ఆకస్మికముగా వారిపైబడి వారి చేతులలోని కర్రలను బలవంతముగా లాగుకొనిరి. సిక్కుపిల్లవానిని కొట్టుటచే "సత్ శ్రీఅకాల్ అని" అరచుచు మహమ్మదీయుల దౌర్జన్యమును గురుద్వారయందలి సిక్కులకు తెలుప సుమారు ౧౦౦ సిక్కులు ఆయుధములుధరించి గంద్రగోళములతో మతవాదముల నుచ్చరించుచు బయలుదేరిరి. కాని యెట్టిఅల్లరులు జరుగలేదు. నేడు రాత్రి ఒక పీరు యూరేగింపు మామూలుగా జరుపుటకు కొందరు దుండగీయులు ప్రయత్నించుచున్నారు. పోలీసువారు మాత్ర మతిజాగ్రతతో వీధులను కాపలాగాయుచున్నారు.

జంగ్లివిఠోబా
దేవాలయము

ఇచ్చట మధ్యాహ్నము కొందరు దుండగీయులు విచ్చుకత్తుల ధరించి దీన్‌దీన్ వాదములతో వీధియందు తిరుగుటచే ప్రజలు భీతాహులై యిండ్లు వాకిళ్లు వేసుకొనియున్నారు. కొట్లు మూసివేయబడినవి.

బేగంబజారు

నేడు సహితము బేగంబజారు, సిద్దిఅంబరు బజారు, మహబూబుగంజ్, ఫీల్ఖానా మొదలగు వీధులలో వర్తకులు తమ కొట్లు మూసివేసికొనియున్నారు.

శంకర్‌శేర్ హోటలు లూటీ

హైదరాబాద ఏప్రిల్ ౭.

నేడు సాయంకాలము కొందరు దుండగీయులు అఫ్జల్‌గంజ్‌యందలి శంకర్‌శేర్ హోటలును లూటీచేసిరి.

సాయుధ దుండగీయుల సంచారము

నగరమునందంతట దుండగీయులు లాఠీలు కర్రలు, కత్తులు, మారణలు పట్టుకొని తిరుగుచున్నందున ప్రజలు భీతాహులగుచున్నారు

ధూలుపేట, మంగల్‌హాటు నందు ౧౪౫ సెక్షన్ సిటీ మేజస్ట్రేటుగారు వారమురోజులవరకు ప్రయోగించినను కొందరు మహమ్మదీయులు లాఠీలయుక్తముగా ఆప్రాంతములందు తిరుగుచున్నారు.

నేడుమధ్యాహ్నము ౧ గంటవరకు యీ అల్లరులవలన ౪ గురు మరణించిరి. సుమారు ౧౦౦ మంది తీవ్రముగా గాయపడిరి. అల్పమైన గాయములు తగిలిన ౧౪౦ మందికి ఆస్పత్రియందు పట్టీలుగట్టినటుల రూఢిగా తెలియుచున్నది.

---

## కడపటి వార్తలు

# హైందవ సామ్రాజ్యసింహాసన మధిష్టించి

## తమ దివ్యనామమును ప్రపంచమున మారుమ్రోగించిన

# ఆంధ్రుల యశోగానము

## పశ్చిమాసియా, గ్రీసు, రోము, యీజిప్టు, చైనాదేశములతో వర్తకవ్యాపారములు జయప్రదముగా జరిపిన ఆంధ్రుల ప్రాచీన వైభవము

# ఆంధ్ర మహా సామ్రాజ్య పరాక్రమ సంపన్నత

ప్రాచీన కాలమున ఆంధ్రులు మిగుల ప్రాముఖ్యత వహించి యుండిరి. మౌర్యవంశమును ఆంధ్రనామముచే విలసిల్లువంశము హిందూదేశము నురవైఆరు వత్సరములుపరిపాలించెను. శ్రీకృష్ణదేవుని అతని వంశమువారిని గూర్చి తమ యాత్రా పరిశోధనములలో, నెల్లూరు మొదలు గోదావరికలకును నుండు తూర్పుదేశము ఆంధ్రదేశమనియు, ఈ యాంధ్రనామ మీవంశమువారికి క్రమక్రమముగా వచ్చినదనియు విల్ఫర్డుగారు చెప్పియున్నారు. "నందవంశమును బలిపుత్ర వంశమును నామమాత్రావశిష్టములైనటు చేయుట, హైందవసామ్రాజ్య సింహాసనము నెక్కి తమనామమును దేశమందంతటను వ్యాపింపజేసిన దీ యాంధ్రులే" యని విల్ఫర్డుగారు వక్కాణించియున్నారు.

"బలపరాక్రమ సంపన్నమగు శాతవాహనులు యాంధ్రవంశము క్రీ పూ. ౧౮౦- వ వత్సరమునుండి రాజ్యముచేసెను. కృష్ణా నదీతీరమున నున్న ధాన్యకటకము వారిముఖ్యస్థానము. మిగుల నుత్సాహపూరితులగు బౌద్ధమతస్థులగుటచే వారు మానవ శక్తికి కైంకర్యములలో నెల్ల గణనీయమగు "అమరావతీ స్తూపము" నిర్మించి చిరకీర్తి గాంచిరి. వారిరాజ్యము మధ్యను హిందూదేశమంతయు నాకమించి దక్షిణమున అలవరాజ్యముల పర్యంతము వ్యాపించియుండెను. తరువాత ఉత్తర భాగమునుండి సిథియనులు వచ్చుటచే యుద్ధము తటస్థమైనది. ఆంధ్ర గౌతమపుత్రుడు శకనులను పల్లవులను మహాసైన్యమును క్రిందనున్న శకులను యుద్ధమున నెదుర్కొని జయలక్ష్మిని మాలిగా నెసని నాసికయొద్దనున్న శిలాశాసనమున చిత్రింపబడియున్నది?ఇదియుంచు మించు క్రీ వె. ౧౫౦-వసంవత్సరమున సంభవించెను. ఆంధ్ర రాజ్యము మిగుల ప్రజాక్షేమకరముగా నుండెను. పశ్చిమాసియా గ్రీసు రోము ఈజిప్టు మున్నగు పశ్చాత్య దేశములతోను చైనా మొదలగు ప్రాగ్దేశములతోను భూమిమీదను సముద్రమార్గమునను గూడ ఆంధ్ర రాజ్యము వర్తక వ్యాపారములు చేయుచుండెడిది. దక్షిణ హిందూస్థానమునుండి రోమక సామ్రాజ్యమునకు రాయబారు లంపబడుచుండిరి. సిరియా యుద్ధములలో హిందూదేశపు గజములనే యుపయోగించుచుండిరి. రోమకరాజ్యమునుండి హిందూదేశమునకు ప్రతివత్సరమును ద్రవ్యము మితముగా పంపబడుచుండెనని ప్లినీ వ్రాసియున్నాడు, ఆంధ్రులు రెండుశాఖలుగా నుండి దేశపరిపాలన మొనర్చుచుండినట్లు కనబడుచున్నది. రాజు తూర్పుభాగము నంతటిని ధాన్యకటకమునుండియు, యువరాజు మైసూరు నుండి పశ్చిమదేశమును పరిపాలించుచుండిరి:- (ఇ. పీరియలు గేజటీయరు, సం.౨, పు. ౩౨౫)

"మహోచ్ఛదశలో నున్నప్పు డాంధ్రరాజ్యమీ ద్వీపకల్పమున నెల్ల పరాక్రమసంపన్నమై యుండియుండవలెను. ఈ వంశస్థులు ఉత్తర పాశ్చాత్యభాగములపై ననేక యుద్ధములలో జయము నంది రాజ్యము నభివృద్ధినొందించిరి. ఈ వంశమున మొదటివాడగు శ్రీముఖ శాతవాహనుడు బ్రహ్మయోగమును పొసినట్లు పున నగరమున కీశాన్యముగా నేబది మైళ్ళదూరములో నున్న నానాఘట్టమునందలి పెద్ద గుహలోని గోడమీదను, అతడు జయమునొందినప్పుడెల్ల మహాస్వభావముతో నొసంగిన బహుమతులవిషయము నాసిక కార్లకొండారి పరిసరములలో నున్న గుహామందిరములయందును, చిత్రింపబడియున్నది. ఈవంశము వారు మాళవ ఘూర్జర దేశములకుకూడ తమ రాజ్యమును వ్యాపింపజేసిరని వారినాణెములను పరిశీలించిన వారికి తెల్లముకాగలదు. వీరిలో శ్రేష్ఠుడగు సుమతిచక్రవర్తి చేమచిలీపట్టణమునకు పడమర ౧ మైళ్ల దూరమునన్న శ్రీకాకుళము మొదటి రాజధానిగా చేయబడెను, కొంతకాలమునకు రాజధాని ధాన్యకటకమునకు మార్చబడెను. (బెర్జెస్సు)

శాతవాహనుల కాలమునం దాంధ్రసామ్రాజ్యమున నొకభాగమగు కోసల [బేరారు] దేశపు చరిత్ర ఆంధ్రులతో సంబంధము కలిగిననాటినుండియు సుప్రసిద్ధిగాంచినది. క్రీ.పూ మూడవ శతాబ్దమున గోదావరీ కృష్ణానదీ ముఖభూములు ఆంధ్రుల యాక్రమణముక్రిందనుండెను. అశోకుని మరణానంతరము వీరిరాజ్య మభివృద్ధిచెంది నాసికవఱకు వ్యాపించియుండెను. ఈ వంశమున ౨౩-వరాజగు గౌతమీపుత్రశాతకర్ణుడు క్రీ. వె. (౧౧౩-౧౩౫) ఆంధ్ర రాష్ట్రమును ఆన్యాయముగా నాక్రమించిన సుజాతులు శకులు వారి వాతవ్యులతో యుద్ధము చేసి జయమునొందెను:— ఇంపీరియల్ గెజటీయరు, సం.౨, పు. ౩౩౮.

మౌర్యవంశస్థుల తరువాత బాక్ట్రియన్ గ్రీకులు వచ్చిరి. (క్రీపూ. ౧౮౦) వారిలో అపల్లోడోటసును బౌద్ధ విద్యానిపుణుడగు మినాండరును సింధు కతియవాడి రాజ్యముల నేలిరి ఇంక దక్షిణమున ద్రావిడ వంశజులను శాతవాహనులు మౌర్యవంశానంతరము తమ రాజ్యము నభివృద్ధినొందజేసి, క్రీ.పూ. ౨౦౦ నాటికి రాజ్యపు సరిహద్దులను నాసిక పడమటి కనుమలకును వ్యాపిపజేసిరి. సిథియనుల జగు క్షుద్రమానవకు ప్రతినిధులుగనుండి యీశాతవాహనవంశస్థులు తమరాజ్యమున ద్వీపకల్పమున కడ్డగను పడమర దమరగంగనుండి పడవాసివఱకును వెంపొందించి ఫరణికోటను ముఖ్యపట్టణముగ చేసికొని యేలుచుండిరి. వీరు పశ్చిమభాగమున తమ యధికారమును సుమారు క్రీ. వె. ౨౧౦-వ వత్సరమందు కోల్పోయినట్లును, అస్థానమున సిథియను స్నాత్రపులు రాజ్య మాక్రమించి పరిపాలించుచుండినట్లును కానబడుచున్నది. (౨౩౦-౪౦౦) ఈరెండు రాజ్యములును మైత్రికలిగియున్నంత కాలము దేశ మభివృద్ధి గాంచినది. బ్రాహ్మణులును బౌద్ధులును రాజ పోషణము పొందుచుండిరి. సముద్రతీర ప్రదేశములందలి పెద్దబాటలలోని పాడు దేవాలయములను బాగుచేయుటకు వర్తకులందరును పంతములతో పాటుపడిరి — ఇమ్ గే., సం. ౨, పు ౨౪౯,

నాగపూరు పరగణాలయందలి మండలములు కలసి నాగపూరు సమభూమి (సువ్యవస్థితమైనది) అని పిలువబడుచుండెను. క్రీ. పూ. రెండవ శతాబ్దమునందు ప్రముఖతనొందిన హైందవ రాజ్యమగు విదర్భకు ఈభాగము చేరియుండెను. తరువాత కొంతకాలమునకు [క్రీ. వె. ౧౧౩] ఈ మండలము లాంధ్రవంశస్థుల చేతిలోనికివచ్చెను. కొంతకాలము ఆంధ్రులకు కప్పముగట్టుచు వచ్చి తరువాత దక్షిణదేశపు రాష్ట్రకూట రాజపుత్రులు వీనినాక్రమించుకొని స్వాతంత్ర్యము వహించిరి ఇమ్. గే, సం.౧౦: పు. ౨,

పురాతనకాలమున నీసముద్రతీర నివాసులు మిగుల ధైర్యసంపన్నులగు నావికులని వేదగీతములును బౌద్ధజాతకములును సిద్ధాంతము చేయుచున్నవి. సుమారు క్రీ.పూ. ౨౦౦ క్రీ. వె. ౨౫౦ సంవత్సరముల మధ్యమున ముద్రితములయిన యాంధ్రవంశ రాజుల నాణెములుకూడ నీ సిద్ధాంతము నే బలపలుచుచున్నవి రెండుస్తంభములుగల యోడయొక్క ప్రతిమ యీ నాణెములపై చిత్రింపబడియుండెను. సింహళ ద్వీపముతో వ్యాపారముచేసెడి హైందవ నౌకలు మిగుల పెద్దవనియు ౩౦౦౦మంది ప్రయాణీకులకు వలయు విస్తీర్ణము గలవనియు ప్లినీ వ్రాసియున్నాడు. నాసిక, కార్లె, అమరావతి — ఈ స్థలములయొద్ద ఆంధ్రవంశజుడగు పులోమాయి చక్రవర్తియొక్క శిల్పశాసనములున్నవని టాలమీయను చరిత్రకారుడు చెప్పియున్నాడు. ఆంధ్రరాజుల నాణ్యములు కొల్హాపురమునొద్ద కానవగును, ఇమ్. గే. సం. ౩.

క్రీస్తుశకమునకు చాలకాలము ముందు ఆంధ్రులు మిగుల నధికారసంపన్నులుగ నుండిరని యీ సైనికులవలన దృఢపడుచున్నది. వారికి ముప్పది గట్టి కోటలును, ౧,౦౦,౦౦౦ పదాతియోధులును ౧,౦౦౦ ఏనుగులును కలవని ప్లినీ చెప్పియున్నాడు, వారు ధైర్యవంతులగు వర్తకులు. బేరారు బొంబాయి రాష్ట్రములలోని కొంతభాగము హైదరాబాదు మాళవదేశము తూర్పుదేశము ఉత్తర హిందూస్థానము వారి పాలనముక్రింద నుండెడివి.

శాలివాహనుని తరువాత రాజ్యమునకు వచ్చినవారిలో నాలుగవవాడగు ముక్కంటికి బ్రాహ్మణ గోత్రములను నిర్మించెననియు, ఈ బ్రాహ్మణులకు గుంటూరు కొచ్చెర్ల వినుకొండ ఈప్పతూరు గ్రామముల నీనాముగా నిచ్చెననియు నాడుక. ముక్కంటియను పేరంగను నీ వంశమురాజు పల్లవంశమును స్థాపించి ధనకోటను రాజధానిగా చేసికొని రాజ్యము చేసెననియు చెప్పుదురు.

పల్లవులనుగురించియు వేంగీదేశపు రాజులగు తూర్పుచాళుక్యులనుగూర్చియు వరంగలు కాకతీయుల విషయమునను, నేనిట నేమియు చెప్పనక్కరలేదు. మహమ్మదీయ దండయాత్రాపరంపరల దక్షిణహిందూస్థానమును ముంచివేయకుండునట్లు కర్ణాటకాంధ్ర నాయకులానకట్టలై నిలిచి యడ్డుపడిరి, కృష్ణదేవరాయల చారిత్రమును కొండవీడు రెడ్డిప్రభువుల ధైర్యసాహసములను నాయకప్రభువుల శౌర్యమును చదివినచో ఎట్టివారును పులకాంకితశరీరులై సగర్వముగా నానందమునొందుదురని నొక్కి చెప్పగలను. మధుర తిరచునాపల్లియొద్దనున్న నాయకులరాజ్యము తీ యాంధ్రుల ప్రతిభను చాటుచున్నది.

ప్రసిద్ధుడగు రామరాజుతో పోయిన యేనుగుగుంది బందికొపులును వారితర్వాతివారును మైసూరుదేశమునకు తలమానికమై యనేకపట్టణములను స్థాపించుట, సప్తదుర్గము మొదలగు కోటలను నిర్మించుట, వారిరాజ్యమాదేశమున విజృంభించి వేరులుపారి తుదకు బలపరాక్రమవంతమై హైదరలీవంటి శూరశిఖామణి నెదిరించుట మున్నగునవి శమింపనాలోచించినయెడల, యెట్టివానికైనను మేనుపులకాంకురములు పొడమకుండునా?

ఎలహంక నాడు ప్రభువులలో నొక్కడగు కెంపేగౌడ యను నాతడు ౧౫౩౭ వ సంవత్సరమున నొకస్థలమందు చిన్న మట్టికోటను కట్టి దానికి బంగళూరు అను నామమిడెను. ఈపట్టణమే యిప్పుడు ప్రసిద్ధిగాంచిన బెంగుళూరు.

విజయనగరము రాజపుత్రపేటలలో నొకడగు ఆనందగజపతి ఆంగ్లేయులతో స్నేహము చేసి తమ్ముల తూర్పుదేశమునను దక్షిణదేశమునను ఆంగ్లరాజ్య విజృంభణమునకు కారకులగుటయు, బొబ్బిలికోటలయొద్ద ఫ్రెంచివారితో ధైర్యసాహసములతో పోరి, వెలమవారు చిరకీర్తి గాంచుటయు, ఈ మొదలగు చరిత్రాంశములను మనమిందు మరువలేము.

మొట్టమొదట నైరోపాదేశస్థులచే తయారుచేయబడిన సిపాయిలు తెలింగానా యను పేరుచే పిలువబడుచుండెడివారనియు, ఈ పేరింకను వాడుకలో నున్నదనియు ఇంపీరియల్ గెజటీయరులో వ్రాయబడియున్నది.

పురాతన హిందూరాజ్యమగు నాంధ్రరాజ్యమునకు త్రిలింగమని పేరనియు, ఆశ్రమములోని కర్ర తద్భవమే తెలుగుఅనియు, తెలుగువారు ధైర్యవంతులనియు; మంచి వ్యవసాయకులనియు, సాహసంపన్న నావికులనియు వీరు మద్రాసు సైన్యమున నెక్కుడుగానుండి యట నాంగ్లరాజ్యస్థాపనమున సహకరించిరనియు, అందుచే వంగదేశమందలి సిపాయిలు సైతము తెలింగానావారని పిలువబడుచుండిరనియు, బ్రిటిషువిజ్ఞాన సర్వస్వములో వ్రాయబడియున్నది,

ఈవిధముగా, మనకు శౌర్యవంతమగు జాతికి వలయులక్షణములు కలవనియు, తూర్పుదేశమున బ్రిటిషుసామ్రాజ్యమును నెలకొల్పినందులకు వారికృతజ్ఞతకు పాత్రులమనియు చెప్పుటకు ఆధారములు కానవచ్చుచున్నవి.

ప్రాచీనాంధ్రుల ఔన్నత్యము, చారిత్రాంశము. ఆంధ్రజాతి చరిత్ర సాంప్రదాయములు, పాండిత్యము, విజ్ఞానము, నిర్మాణశక్తి నిరుపమానమైనవిగ నుండెను. ౪౦౦ సంవత్సరముల కాలము ఆంధ్రసామ్రాజ్యము భారతదేశమునందక్కుడుభాగమున వ్యాపించియుండెను. అమరావతి విశ్వవిద్యాలయము యావద్భారతప్రసిద్ధిగాంచియుండెను. విజయనగర సామ్రాజ్యము నాగరక ప్రపంచపుదృష్టిని ఆకర్షించుచుండెను. నౌకావాణిజ్యమున, ఆంధ్రులు ప్రఖ్యాతిగాంచియుండిరి. పసిఫిక మహాసముద్రపు ద్వీపములందు ఆంధ్రులు కాలనీలు ఏర్పరచియుండిరి.

— ఆంధ్ర

# అందుబాటులోగల ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సౌకర్యములు

## మదరాసు అసెంబ్లీలో ప్రధానామాత్యుని సమర్థన

అన్నిపక్షములవారలును భాషాప్రయుక్త రాష్ట్ర విభజనతీర్మానము నామోదించుట

(గోలకొండ విలేఖరి)

మదరాసు: మార్చి ౩౧

మదరాసు అసెంబ్లీలో నిన్నటిరాత్రి ౯గం టలకు శ్రీయుత కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఈక్రింది తీర్మానమును ప్రతిపాదించిరి:

"తమిళము, కన్నడ., మళయాళము ఈ భాషలు ఎక్కువగా మాటాడబడుచున్న ప్రాంతములను స్వతంత్ర పరిపాలనగల ప్రత్యేకరాష్ట్రములుగ సాధ్యమైనంతత్వరలో ఏర్పాటుచేయుటకు ప్రయత్నము చేయవచ్చునని ఈసభవారి అభిప్రాయమును భారతరాజ్యాంగ శాసనము ౨౯౦వ సెక్షను ప్రకారము సార్వభౌమ ప్రభుత్వమునకు తెలుపవలసినదిగ ఈసభవారు ప్రభుత్వమువారికి శిఫారసు చేయుచున్నారు."

తీర్మానముపై ఉపన్యసించుచు కొండా వెంకటప్పయ్య పంతులుగారు పూర్వకాలములోను, మహమ్మదీయ కాలములోను భాషనుబట్టియే రాష్ట్ర విభజనముండెననియు, బ్రిటిషు రాజ్యాధికారము నాటినుండి చెన్నరాజధానిపేర ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక, కేరళ భూభాగములు నాలుగును ఏకమయ్యెననియు, అప్పటినుండి ఈనాలుగుభాషల వారలును సమాభివృద్ధి గాంచలేదనియు చెప్పిరి.

తర్వాత వెంకటప్పయ్యగారు "భారతదేశములోని వివిధరాష్ట్రములను జాతినిబట్టి, భాషనుబట్టి నిర్మించినచో, ఆయారాష్ట్ర ప్రభుత్వము లందు ఆయారాష్ట్రీయుల కధికారము అధికము లేర్పడి, దేశాభ్యుదయమునకు తోడ్పడియుండెడి"దని యిదివరకొకప్పుడు లెఫ్టినెంటు గవర్నరుగనున్న సర్ బాంప్ఫైడిల్ ఫుల్లర్ గారు వ్రాసియుండిరనిరి, ఇట్టి భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమున కనుకూలమైన ఫుల్లర్ గారి అభిప్రాయమును చెప్పిరి.

తర్వాత ఆంధ్రరాష్ట్రోద్యమ పూర్వచరిత్రను ౧౯౩౭లో రాయలసీమవారలకును గల భేదాభిప్రాయములను సమాధానపరచుటకై గావించబడిన శ్రీబాగు ఒడంబడికనుకు వర్ణించి, ఉత్కళములోనికి చేర్చబడిన భాగములను వదిలివేసినప్పటికి ఆంధ్రమండలమువల్ల ఆదాయము ౧౯౩౨-౩౩సం॥నకు రు౧౮,౦౦౦౦౦౦౦ లు, ఖర్చు రు ౪౪౪౪౫౦౦౦ లు. సింధు మొదలైనవానికవలె ఆంధ్రరాష్ట్రమునకు ప్రభుత్వము విరాళము నొసగవలసిన పనిలేదు."అని ప్రత్యేకముగ ఆంధ్రరాష్ట్రనిర్మాణ సౌకర్యమును సమర్థించిరి.

తర్వాత కే. కోటిరెడ్డిగారు (రాయలసీమ) బలపరచిరి. కన్నడులపక్షమున, కన్నడరాష్ట్ర నిర్మాణావసరమును సూచించుటకు సార్లమెంటరీ సెక్రటరీ శ. ఆర్. కరద్కగారు బలపరచిరి. మళయాళపక్షమున ఏ. కరుణాకర మీనన్ గారు బలపరచిరి.

యూరపీయులపక్షమున జి. ఇ. వాకరుగారు ఇతరరాష్ట్రముల నిర్మాణముకంటె ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకే ప్రబలతరకారణములును ప్రబలతరములైన హక్కులును గలవనిరి. కాని భారతదేశమంతయు సంయుక్తాశయముతో పనిచేయవలసిన నీకాలములో రాష్ట్ర విభజనము యుక్తముకాదనియు చెప్పిరి.

కల్లూరు సుబ్బారావుగారు తీర్మానమును బలపరచినతర్వాత అబ్దుల్ రహిమాన్ ఖాన్ గారు (కర్నూలు) ప్రసంగించుచు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ప్రతిఘటించుటలేదు గాని ప్రతిబంధకములను కొన్నిటిని ఉదాహరింపదలచితిననిరి. ఆంధ్రుల మొత్తము జనసంఖ్య ౨౩౦ లక్షలు. అందు ౭౦ లక్షలు హైదరాబాదు మైసూరులలో నున్నారు. బ్రిటిషు తెలుగుజిల్లాలలో ౧౬౦ లక్షలమందికంటె ఎక్కువమందిలేరు. మిగిలినవారు అరవజిల్లాలలోనున్నారు. ఆంధ్రరాష్ట్రము నేర్పరచినచో ఒకచో నున్న తెలుగుజిల్లాలు ఆంధ్రులకు లభించవచ్చును. కాని ఇతరప్రాంతములయందలి ఆంధ్రుల నేకము చేయుట కెటులుపయోగించునో తెలియకున్నది, అది సాధ్యమగుననితోచదు. ఇదిగాక సరిహద్దులయందు ద్విభాషాప్రాంతములు కొన్నిగలవు. వానిసమస్యను పరిష్కరించుటెటులు? ఇదిగాక, తెలుగుజిల్లాలలో మహమ్మదీయులు గలరు, వారిమాటయేమి? వారిభాషను, వారి విజ్ఞానమును సంరక్షించుట కెట్టియేర్పాటు లొనర్పబడును?

మహబూ లీబేగ్ గారు (కృష్ణా) తీర్మానమును బలపరచుచు అబ్దుల్ రహిమాన్ గారి శంకలకు సమాధానమిచ్చిరి. ఆంధ్రరాష్ట్ర మేర్పడినపుడు మహమ్మదీయుల మాట యేమను ప్రశ్నకు సమాధానమిచ్చుచు, మహబూలీబేగు గారు మహమ్మదీయుల సమస్య భారతదేశముక కంతటికిని సంబంధించినదనియు, ప్రస్తుతమీ రాష్ట్రమునను మహమ్మదీయుల సమస్య ఏటులున్నదో ముందు ప్రత్యేక భాషాప్రయుక్త రాష్ట్రము

ఏర్పడినపిమ్మట ఆంధ్రములోగాని ఇతర రాష్ట్రములలోగాని అధికసంఖ్యాకసంఘములు మహమ్మదీయుల సౌసత్యముల భంగపరచుటకు ప్రయత్నించురని భయపడుటకట్టి అవకాశము లేదు. సింధు, పంజాబు, సరిహద్దు రాష్ట్రములలో అల్పసంఖ్యాకులుగనున్న హిందువుల కట్టి సౌకర్యము లొసగబడుచుండెనో మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగనున్న రాష్ట్రములలో వారలకట్టి సౌకర్యము లొసగబడును. కనుక రాష్ట్రనిర్మాణ విషయములో మహమ్మదీయసమస్యను తెచ్చుట అనవసరము. ఇక ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించినంతవరకు అచట హిందువులును, మహమ్మదీయులును చాల అన్యోన్యభావముతో మెలగుచున్నారు. అధికసంఖ్యాక సంఘమువారెన్నడును మహమ్మదీయుల హక్కులను నిరోధించుటకేమాత్రమును ప్రయత్నించియుండలేదు. మహమ్మదీయులను, వారి జ్ఞానమును. భాషను పరిసమాన గౌరవభావముతో ఆదరించుచున్నారు. అట్టి సౌమనస్యమే ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణానంతరముగూడ కొనసాగునని నమ్మెదను. ఈవిషయమై ఆంధ్రదేశమునందు హిందువులనుండి మహమ్మదీయుల కట్టి హామీలుగాని, కంట్రాక్టులుగాని అక్కరలేదు. ఆంధ్రవాఙ్మయములివిషయమున అనేకపర్యాయములు అభయమొసగియే యున్నారు. కనుక దీవిషయమున మహమ్మదీయసమస్యను దెచ్చుట అనవసరము."

తీర్మానమును ప్రభుత్వపక్షమున ప్రధానమంత్రి రాజగోపాలచారిగారు సమర్థించిరి భాషనుబట్టి రాష్ట్రముల నేర్పరచుచో వానికి నిర్ణయింపవలసిన సరిహద్దులనుగురించి గూడ ప్రస్తుతము ప్రసంగించుట అనవసరమనుచు ఇట్లు చెప్పిరి: "సరిహద్దుల విషయము చాల అల్పమైనది అసలుభాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణము అంగీకరింపబడి రాష్ట్రవిభజనము జరుగునపుడా విషయములను చర్చించుకొనవచ్చును. అంతవరకును మాత్రము అనవసరమగు వివాదముల బెంచుకొని అనవసరకలహములకు తావొసగరాదు."

ఇంకను ఇట్లు నుడివిరి: "పైవిజ్ఞప్తి రాయలసీమకుగూడ వర్తించునని ప్రధానమంత్రిగారు నుడివిరి. రాయలసీమ ఆంధ్రరాష్ట్రములో చేరునా చేరదాయనువివాదము ప్రస్తుతము అనవసరము, రాయలసీమ లేకపోయినను గూడ ఆంధ్రరాష్ట్రము నేర్పరుపవచ్చును. ఆంధ్రరాష్ట్ర నిర్మాణసిద్ధాంతము రాయలసీమ ఆరాష్ట్రమున చేరునా లేదా యనువిషయముపై నాధారపడలేదు. భాషనుబట్టి రాష్ట్రముల నేర్పరచుట అవసరమా కాదాయను ఏకసిద్ధాంతముపైననే ఆధారపడియున్నది. కొన్నిప్రాంతములా రాష్ట్రమున చేరవచ్చును. మరికొన్ని చేరకపోవచ్చును, ప్రపంచమున నేదియు పూర్తిగ నిర్దుష్టమైనదిగాని లోపరహితమైనదిగాని లేదు. సరిహద్దుల నిర్ణయమునకుగూడ నిది వర్తించును. ఈ రాష్ట్రమునకు దక్షిణాగమునన్న తిరునెల్వేలి రామనాథపురం జిల్లాలో ఆంధ్రులు విశేషముగ గలరు. ఆంధ్రదేశమునకు ఆప్రాంతములకును ఎంతదూరముకలదు. ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడినంతమాత్రమున, ఆంధ్రదేశమున హిట్లరు బయలుదేరి ఇతరప్రాంతములం దెచ్చటనో యున్న ఆంధ్రులందరుగూడి తన ప్రభుత్వముక్రిందికే రావలెనని పోరాటమునకు సిద్ధమగుచుండునని అర్థముగాదు.

ప్రధానిగారు తమ ఉపన్యాసము సాగించుచు నిట్లుచెప్పిరి, "ప్రస్తుతము కేరళ కన్నడరాష్ట్రముల నేర్పరచుట కొంత కష్టమగుచో, వాటి నిర్మాణమున కొంత ఆలస్యముజరిగిన జరుగవచ్చును. కాని ఎట్టిచిక్కులులేని ఇతరభాషా ప్రాంతములను నిరాలస్యముగ ప్రత్యేకరాష్ట్రములుగ నేర్పరుపవచ్చును. అరవవారు ప్రత్యేకరాష్ట్రమును కోరుటలేదని తలంపరాదు. ఇతరులవలె వారంతగ నావిషయమై గగ్గోలుచేయుచుండకపోవచ్చును. అంతమాత్రమున వారికి ప్రత్యేకరాష్ట్ర మక్కరలేదని భావించరాదు. వారటులుండుటకనేక కారణము లుండవచ్చును. ఇతరులకంటె వారిలో స్వీయప్రాంతాభిమాన మంతగా లేకపోవుట యొక కారణము గావచ్చును. మదరాసు రాష్ట్రమునందు ఇతరభాషా ప్రాంతములవారు వేరుపడిపోవుచో మిగిలినదేశమంతయు నసితో తమకే మిగులునని దాయనకూడ భావించి ఊరకుండవచ్చును. ఎటులైననసరే అరవలు ఆంధ్రజిల్లాలు తమతో కలసి యుండుకొనగోరుచున్నారనుభావము నిరాధారమైనది.

తర్వాత రాజగోపాలాచారిగారు ఆంధ్రోద్యమము యొక్క పూర్వచరిత్రను వర్ణించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ముఖ్యావసరములని భావింపబడిన అన్నిలక్షణములు ఉన్నవిగనుక, "ఏసెంబ్లీ గనుకనిచూచినను గూడ ప్రత్యేకాంధ్ర నిర్మాణము గణ్యమైన దని అంగీకరించకతప్పదు" అని ముగించిరి.

కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ తీర్మానము నామోదించినందులకు అన్నిపక్షముల వారికిని వందనమర్పించిరి.

